

శ్రీరస్తు.



శ్రీమద్భగవద్భాగవతాచార్య కృపాపా
త్రుండును ఆపస్తంబ సూత్రుండును
కాసిక గోత్రుండును సుజనమిత్రుం
డును నగు గంగవరపు పట్టా
భిరామదాసశర్మ హృద
యాంతర్గత భగవ
ద్విరచితము.



# శ్రీ వైకుంఠ మార్గము.

ఇది బ్రహ్మవేత్తలచే పరిష్కరింపంబడి

బ్ర॥ భట్టిప్రోలు సుబ్బారావుగారి 

స్వకీయ

శ్రీభారతీవిలాస ముద్రాక్షరశాలయందు ముద్రింపించి

ప్రకటింపంబడినది. 

బాపట్ల.



సౌమ్యనామ సం॥ వైశాఖ బ ౧ గురువాసరము

ది 6 మే 1909 సం॥

దీని వెల రు 1-0-0

బ్రహ్మనిష్ఠులు, గురువులవారు.

పరమకళ్యాణి. శిష్యుడు.



శ్రీమత్తిరుమలకుమార శ్రీనివాసాచార్యులు అయ్యగారు

## ఆచార్యలక్షణము.

శ్లో॥ ఆచార్యో వేదసంపన్నో విష్ణుభక్తో - విమత్సరః - మంత్రజ్ఞో మంత్రభక్తశ్చ - సదా మంత్రాశ్రయశ్శుచిః ఏవంలక్షణ సంపన్నో - గురురిత్యభిధీయతే। గు శబ్దస్త్వంధకారస్స్యాద్రు శబ్దస్తన్నిరోధకః॥ అంధకార నిరోధత్వాద్గురురిత్యభిధీయతే। ఆచినోతి హిశాస్త్రార్థా - నాచారే స్థాపయంతి చ - స్వయమాచరతే యస్తు - సాచార్య ఇతి కథ్యతే।

గం॥ పట్టాభిరామదాస శర్మ,

గం॥ పట్టాభిరామదాస శర్మ,

## శిష్యలక్షణము.

శ్లో॥ శరీరం వసు విజ్ఞానం। వాసః కర్మ గుణానసూన్ గుర్వర్థం ధారయేద్యస్తు - సశిష్యో నేతరస్స్మృతః

తాత్పర్యము॥

సచ్ఛిష్యుని యొక్క - శరీర ధారణము - ధనార్జనము - బ్రహ్మవిచారణము - వస్త్రధారణము - కర్మాకర్మలును - ప్రా[illegible]ణ పరిపాలన చేయుట ప్రాణధారణము గురువాజ్ఞ చే చేయబడునని యభిప్రాయము

గం॥ పట్టాభిరామదాస శర్మ,

# విషయసూచిక.

గీ॥ పరమ భాగవతులు।పాటించు పథమిది।యీ విధమున యోగి యెరుగు నేని మరలి రాఁడు వాఁడు।మరి పంచభూతములతో।కల్పశతము లైన గానవే దా౯

సీ॥ విష్ణుకీర్తనములు।వినని కర్ణంబులు।కొండలబిలములు కువలయేశ! చక్రిపద్యంబులు చదువని జిహ్వలు।కప్పల జిహ్వలు।కౌరవేంద్ర! శ్రీమనోనాథు నీక్షింపని కన్నులు కేకిపింఛాక్షులు।కీర్తి ఉదయిత।కమలాక్షు పూజకు।గాని హస్తంబులు।శవము హస్తంబులు।సత్యవచన॥ హరిపాదతులసి।ఘ్రాణింపగ లేని।ముక్కు పంది ముక్కు।ముని చరిత్ర।గరుడగమను భజన।గతిలేని పదములు పాదపముల పాదపటలము నఘా॥

సీ॥ కంజాక్షునకు గాని।కాయంబు కాయమే।పవనకుంభిత చర్మ।భస్త్రి గాక।వైకుంఠు బొగడని।వక్త్రంబు వక్త్రమే।ఢమఢమ ధ్వనితోడి।ఢక్క గాక।హరిపూజనము లేని। హస్తంబు హస్తమే।తరుశాఖనిర్మిత దర్వి గాక।కమలేశు జూడని కన్నులు కన్నులే।తనుకుడ్యజాలరంధ్రములు గాక చక్రిచింత లేని జన్మంబు జన్మమే।తరళ సలిలబుద్బుదంబు గాక।విష్ణుభక్తి లేని।విబుధుండు విబుధుడే।పాదయుగముతోడి।పశువు గాక॥

సీ॥ కమలాక్షు నర్చించు కరములు-కరములు, శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ-సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు, శేషశాయికి మ్రొక్కు-శిరము శిరము విష్ణు నాకర్ణించు వీనులు వీనులు।మధువైరి దగిలిన-మనము మనము-భగవంతు వలగొను-పదములు పదములు పురుషోత్తముని మీది-బుద్ధి బుద్ధి-దేవదేవుని జింతించు-దినము దినము- చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు-కుంభినీధవు జెప్పెడు గురుడు గురుడు-తండ్రి హరి జేరుమనియెడు- తండ్రి తండ్రి॥

క॥ వాసములు వేయు నేటికి-వేదోక్తవిధిం జరించు విబుధుల గృహమం దాదర్శమున నారాయణాహ్వయంబులు-గొలచి ముక్తిపథమున కేగున్॥

గీ॥ దనుజ భుజగ యక్ష దైత్య మృగాభీర-సుందరీ విహంగ-శూద్ర శబర- పాపజీవు లయిన ముక్తికి బోదురు-యఖిల జగము విష్ణుఁ డనుచు దలచి॥

భగవత్ప్రభావము.

(సంపూర్ణము.)

## —* గ్రంథ పారాయణ పురుషార్థము. *—

సీ॥ వైకుంఠమార్గంబు-నేకార్తికుడుగోరు - నాకార్తికుండొండు నఖిలసుఖము - వైకుంఠమార్గంబునేకార్తికుఁడుగొను - నాకార్తికుండందు నఖిలజయము-వైకుంఠమార్గంబునేకార్తికుడువిను - నాకార్తికుడుబొందు నఖిలధనమ్ము - వైకుంఠమార్గంబు నేకార్తికుడుగను - నాకార్తికుండందు నఖిలఘనము - దీనిదెలసిన నొకరికిదెల్పుచున్న - మానసంబున నైనను మరిగియున్న - దానధర్మాదిక గ్ర ల దగులకున్న - మానవుడుగాడు వాడెపో మాధవుండు॥

గీ॥ నూటయేఁబదిమారులు నోటితోడ - ధాటిగాదీనిజదివిన దైవమగును - మాటిమాటికి మనమున మరులుకొన్న - కోటికల్పంబులకుఁగానిగుడినుండు. *పుస్తకప్రకటన॥ * * * *

శ్రీమన్నారాయణుండు ప్రణవవాచ్యంబగు పరబ్రహ్మము అట్టి నారాయణునందు నిత్యవిభూతి లీలావిభూతులను రెండులోకంబులు గలవు. నిత్యవిభూతి యేకాకారముగా నుండును. లీలావిభూతి యనంతకోటిబ్రహ్మాండంబులు గలదై యుండును. శ్రీమన్నారాయణుండు ప్రణవవాచ్యుండయి యుండునపుడు నిర్గుణుండు. నిత్యవిభూతియం దుండునపుడు శుద్ధసత్వగుణయుక్తుండు. లీలావిభూతియందుండునపుడు మిశ్రసత్వగుణుండు బ్రహ్మాండంబనగా కుక్కుటాండమురీతినుండునది యిందుకు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సృష్టిస్థితి సంహారకర్తలుగా నుందురు. వీరలకు పంచభూతంబులగు ఆకాశము వాయుదేవుండు, సూర్యదేవుండు, వరుణదేవుండు, భూదేవతయు పరివారముగా నుందురు. ఈత్రిమూర్తులకు ప్రద్యుమ్నానిరుద్ధసంకర్షణ శబ్దములు పర్యాయవాచకంబులుగా నుండును. కుక్కుటములవలెనకుక్కుటాండములుద్భవించినట్లు బ్రహ్మమువలనబ్రహ్మాండంబు లుద్భవించె. ఈలాగునయనంతకోటిబ్రహ్మాండంబులున్నూ పంచభూతాత్మకముగానే యుండును. ఇందొక బ్రహ్మాండము మనకునికిపట్టయియుండెను. ఈబ్రహ్మాండమునందుపదునాలుగులోకంబులుండి కర్ణికణపులుభంగి అధోభాగమునుండి యూర్ధ్వభాగమును వ్యాపిం

చియుండెను, ఇందు యీభూలోకము యెన్నిదవదిగా నుండును. యీలోకమునందె సప్తసముద్రంబులు సప్తద్వీపంబులుగలిగియుండు. ఇందు మధ్యభాగము జంబుద్వీపము-దీనిం జుట్టుకొని చక్రాకారము గా లవణసముద్ర ముండెను. ఈలాగుననే సప్తద్వీపములను సప్తస ముద్రంబులు జుట్టుకొని ఒకద్వీపముకంటె మరియొకద్వీపము యిబ్బడి పరిమితము గలదయి యుండును. ఈ జంబుద్వీపము తొమ్మిదిఖండ ములు గలిగి యుండును. ఇందు భరతఖండమందు కలకత్తా, బొంబా యి, మొదలగు కొన్ని రాజధానీలు గలిగియుండును. ఇందు చె న్నపట్టణరాజధాని కొన్నిజిల్లాలు గలిగియుండును. ఇందు గుంటూరు జిల్లా కొన్ని తాలుకాలు గలిగియుండును. ఇందు బాపట్ల తాలూ కా కొన్నిగ్రామంబులు గలిగియుండును. ఇందు యింకొల్లుగ్రామం బునందు సిరుపార్శ్వములందు పత్నినది భగినీనది యను-రెండునదు లు గలిగియుండును. తన్నదీద్వయ మధ్యవర్తిగా శ్రీచన్నకేశవమ హాక్షేత్రంబు గలిగి సువర్ణరత్నమయంబుగా వెలుంగు- ఆయుభయ కావేరిమధ్య శ్రీరంగనాథమహాప్రభువారు వేంచేసియుండినట్లు- ఈపత్నీ భగినీ నదులమధ్య శ్రీచెన్నకేశవ మహా ప్రభువారు క్షేత్రపాలకుండయి ప్రకాశించును. తత్సన్నిధి కైంకర్యపరుండయి గ్రంథకర్త నివసించి యుండగా ఇట్టి కైంకర్యపరుని- శ్రీబాపట్ల భావనారాయణస్వామివారుపిలిపించిబలోద్బంధి చేసిపుస్తకముసంపూ ర్తిజేయించె॥ గావున ఈగ్రంథమువలయు వారల్లు పేరాలగ్రామక రణం రావులలోకనాథంపంతులవారికి తెలియజేయుడు. వ్యాల్యూపేబి లుద్వారా పంపబడును. ఇందులకయ్యెం రు 1—0—0. ఇయ్యది కైంకర్యార్థముగానుపయోగింపబడును. ఈద్రవ్యద్వారా ననేకపుస్త కములు విస్తరింపంబడును. * * * * * * * *

☞ గం॥ పట్టాభిరామదాసశర్మ,
✠ దివ్యదేశవాసి, బాపట్లదేవస్థానం.

# శుద్ధపత్రిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧ | ౯ | నామధేయునకిల | నాభిధానునకిల |
| ౩ | ౧౦౧ | భక్తివిష్ణుం | భక్తినిష్టుం |
| ౧ | ౮ | శ్రీరామచంద్ర | శ్రీరామచంద్ర- |
| ౩ | ౧౫ | సన్ను | నన్ను |
| ౪ | ౪ | యర్చక | సర్చక |
| ౭ | ౨ | అజుర్వేదము | ఋగ్వేదము |
| ౭ | ౮ | ఋగ్వేదము | యజుర్వేదము |
| ౯ | ౭ | దెవియు | దేవియు |
| ౧౩ | ౨౨ | పరిమళములు | పరిమళములు |
| ౧౪ | ౧౯ | | ఆరగించుమీ।రంగ।ఆరగించుమీ |
| ౧౪ | ౬ | బిం-డెడు | బిందెడు |
| ౧౬ | ౨ | శక- | శంక |
| ౧౬ | ౧౦ | మంత్రానంతు | మంత్రాధీనంతు |
| ౧౬ | ౨౩ | న్లినాక్షుడ | నళినాక్షుడ |
| ౧౫ | ౧౩ | ఇషాను | ఇష్టాను |
| ౨౦ | ౩ | పూజి | పూజ- |
| ౨౦ | ౧౭ | దదో మో | దూరద దేమో |
| ౨౨ | ౬ | మహూాత్సవం | మహోత్సవం |
| ౨౨ | ౧౧ | మహూత్సవం | మహోత్సవం |
| ౨౪ | ౧౮ | ధనణీన | ధరణీన |
| ౨౮ | ౧౮ | చపము | చరణము |
| ౨౬ | ౮ | కొలుపుకు | కొలువును |
| ౨౬ | ౪ | పాయుధహస్తుశవగుచు | సాయుధహస్తుడవగుచు |
| ౨౯ | ౩ | స్తుతంచి | స్తుతించి |

శ్రీరామా.

# గ్రంథకర్త వంశావళి.



సీ॥ శ్రీకరంబుగహరి సేవ జేయుచునుండు - భూసురుండొక్క-
డుభువినిగలఁడు । ఆతఁడు కృష్ణాఖ్యనతిశయిల్లుచునుండు - నార్యవరసంతా
నమందియుండు । అందునుదర్శనమధికగుణాఢ్యుండు - జ్యేష్ఠుండు
శ్రేష్ఠుండు స్థిరమతియున్ను । రామయ లక్ష్మీనారాయణయనువార-
లామహాత్మునితమ్ములధికబుధులు । జ్యేష్ఠునకు వానియువతియు శిష్ట
రాలు - నామెనాదెమ్మయనుచుండు । రఖిలజనము । నాశుభాంగికి
ననదృశ శ్రీసుదర్శ । నామధేయునికిలబుట్టి । నాడనేను ॥క॥ పట్టాభిరా
మదాసుడ - బట్టితిసర్వార్యపాదపద్మంబులనే - మట్టితిసకలాఘంబుల
ముట్టితిధర్మార్థములిల । ముదములనెల్లన్ ॥

సీ॥ మరియుమజ్జనకుండు । హరిబోల వెలుగొందె । కౌశికగోత్రుడై
గంగవరపు - వంశమందునచాల - వర్ధిల్లుచును మిగుల - నార్వేలని
యోగియునగబరగి - ధాత్రినాపస్తంబసూత్రముచేమించి - యజుశ్శాఖ
గానుండి యజ్ఞపతితతి । జేయుచునర్వేశు - సేవింపమదినెంచి - తత్వాన
ములనులేయుచు జేసి । బ్రహ్మభావముగనుగొని - బ్రహ్మనిష్ఠ । బ్రహ్మ
గోత్రమపూజలుంకి(?) జేసి - బ్రహ్మఘాతుఁడు గానఁ జెప్పబడె మునుగను
బ్రహ్మవిదునకీ చెలియ డీశాటనిధము(?)॥ క॥ మాజనకునకును భగినులు
నీజగమానము గ్గురైరి - యింపుగలిగ్వన్ - తేజమున సపరుప(?)శ్రీక -
లాజితకామునకు గల్గి - రగ్న లభంగిన్ ॥ గీ॥ పుత్రికలుబుట్టినానక
బుట్టినాఁడ - యేకపుత్రుండటంచునే నెంచబడితి - యిట్టినాయఁడు హరి
జేరియుంపుమీర - పుస్తకంబచ్చుపడజేసె బుధులు మెచ్చ॥

## పుస్తకమహాత్మ్యము.

క॥ ఈపుస్తకోక్తరీతిని । నేపురుషుడు సేవజేయు నింద్రియజయుడై - నాపురుషుండిహమందే - శ్రీపతిభోగంబులంది - శ్రేయములొందుర్॥

### ఇందుకు ఉపన్యాసములు.

వ॥ ఇట్లగునేని యిప్పుస్తకంబుపసే సేవజేయగూడదో వేదమంత్రంబు లధికంబులు గదాయన

ఉత్తర్వు - వేదమంత్రంబులు స్వరపదవర్ణలోపంబులు సంభవించునప్పుడు బ్రహ్మహత్యాదిదోషంబు లివ్వవచ్చును. ఇప్పుస్తకంబట్లుచేయక - వేద పారాయణఫలంబునూ సర్వతీర్థ ఫలంబును సమకూర్చును॥

### ఇందుకుప్రమాణములు.

సర్వవేదేషుయత్పుణ్యం సర్వతీర్థేషుయత్ఫలం తత్ఫలంపురుష అప్నోతి - స్తుత్వాదేవంజనార్దనం అనియుండెను। దీనిఅర్థంబు విచారింపుడు॥

### ఇదిశాస్త్రోక్తముగా నుండెనాయన.

గీ॥ అర్థశాస్త్రపరుడు అర్థంబుగోరును - శబ్దశాస్త్రపరుడుశబ్దమరియు - భాగవతుడుమిగులభక్తినపేక్షించు గానభక్తినిందు గాంచవలయు॥ ।వ॥ సర్వోషపస్తువు భగవంతుండుగక్క మరియొక్కటిలేదుగావున భగవద్భక్తియే ప్రాధాన్యము॥ బ్రాహ్మణునకు కర్మని

ష్టకంటె మరియొక్కటి శ్రేష్టముగునాయన॥ ప్రహ్లాద వచనము॥

క॥ చాలదుభూదేవత్వము - చాలదుదేవత్వమధిక శాంత త్వంబుల్-చాలదుహరిమెప్పింపవిశాలోద్యమములారభక్తిజాలినభంగిన్॥

కర్మాసక్తివలన ప్రత్యవాయముగలదాయన.

క॥ కర్మమునబుట్టుజంతువు కర్మమునసమ్మృద్ధినొందు - కర్మమునజెడుక్ కర్మమెజనులకుదేవత -కర్మముసుఖదుఃఖములకుకారణమధిపా॥ అనియుండుటంజేసి। కర్మచే జన్మరాహిత్యము|కాజాలదు॥

ప్రశ్న-అట్టిభక్తి బ్రాహ్మణులకే విధియని చెప్పదగునాయన॥

శ్లో॥ విష్ణోర్గానంచనృత్యంచనటనంచ - విశేషతః బ్రహ్మన్ బ్రాహ్మణవర్ణానాం। కర్తవ్యంనిత్యకర్మవత్॥ అనియుండటంజేసి-సంధ్యానికర్మలతోపాటు బ్రాహ్మణులు నిస్సంకల్పముచే భగవత్సంకీర్తనాదులును సేయదగియుండును- యిందువలననే దేవతారాధనకాలమందు - ఛత్రం సమర్పయామి చామరంసమర్పయామి అని ఛత్రచామర నృత్తగీతాదులు నిత్యము వచనరూపముగా మనపెద్దలు సమర్పించుచున్నారు॥

ప్రశ్న॥ కర్మనిష్ఠునికంటె భక్తినిష్టుం డతిశయత్వమొందునాయన

ఉత్తరవు॥ శ్రీనృసింహావతార సమయమందు తపోనిష్ఠులు కర్మనిష్ఠులుగానుండు దేవబ్రాహ్మణులందరికంటె - ప్రహ్లాదుండు భక్తినిష్ఠుండగుటచే యతిశయత్వమొందె॥

ప్రశ్న॥ ఇట్టిభక్తి సగుణ మందుసేయదగునాయన॥

ఉత్తరవు॥ ఆరురుక్షులకు సాకారము సగుణము ముఖ్యావశ్య

కములై యుండును॥

## ఇందుకు ప్రహ్లాదవచనము

సీ॥ నీగృహాంగణభూమినిటలంబు మోవంగ - మోదించి నిత్యంబు మ్రొక్కఁడేని॥ ॥గీ॥ నిన్ను జెవులారవినఁడేని - నీకు సేవ జేయరాఁడేని బ్రహ్మను జెందగలఁడె - యోగియైన తపోవ్రతయోగియైన - వేదియయ్యును మహాతత్త్వవేదియైన॥ యీలాటి సంగతులు దెలిసియుండుము॥

ప్రశ్న॥ విగ్రహారాధనపరులు అల్పబుద్ధులుగదా యన

ఉత్తర్యు॥ ఈషణ్మాత్ర ధ్యానశక్తి గల్గియుండువారలు అల్పబుద్ధులే యనబడుదురు॥ గాన ప్రహ్లాదనారదాదులునూ మధ్వరామానుజశంకరాదులునూ - విగ్రహార్చనము - వదిలియుండలేదు - అంతకంటె మనసాధికులముగా నెంచఁబడదు॥

కొంతమంది విగ్రహారాధనము నింద్యముగా దలంచుచున్నారే యన - అట్టివారలకు శాస్త్రజ్ఞానమునూ అనుభవజ్ఞానమునూ కూడా లేదని చెప్పవచ్చును - ఎందువల్లనన - శాస్త్రతః విచారించేయెడల - విగ్రహముల నన్నిటిని విడువవలయు - విగ్రహమనగా శరీరములకర్థము - విశేషముగా గ్రహింపబడునట్టిది విగ్రహము - యీ విగ్రహము మృత్పాషాణాది రూపముగానూ దేవమనుష్య పశుపక్ష్యాది రూపములుగానూ యుండుటంజేసి స్వదేహాభిమానంబు గల్గియుండువరకు భగవద్విగ్రహములయందభిమానము గల్గియుండవచ్చును - స్వదేహమును మరచి - కాలోన్మత్త పిశాచములచందంబున - మదిరాపానపరవశునిమాదిరి - వర్తించుతరిని విగ్రహారాధన చేయకున్ననూ దోషము చెందనేరదు - యిది విగ్రహారాధన నిరాకరణ లక్షణము - యిట్టి ప్రవర్తన సంభవించనపుడు విగ్రహ నిగ్రహము - నాస్తికత్వధర్మమును వెల్లడిజేయుచున్నది॥

మహాపుణ్యాన్ భగవద్భక్తిసంయుతాన్ - అన్యాన్ భాగవతాన్ మత్వా - నమస్కృత్వామహుస్మహుః - భగవత్సంకీర్తనాన్యద్య - కరిష్యామీశ్వరాజ్ఞయా - ధ్యానమావాహనాదీంశ్చ స్నానపానాదికాన్ తథాఏకాంతోత్సవపర్యంతం - సర్వంచాపియథాక్రమం ॥ తస్యాంతేమంతకీమాహాత్మ్యంమంత్రస్యమననక్రమం మంతార్ధంచ వదిష్యామి బాలానాంబోధనేచ్ఛయా ॥ ఏకాంతంచాపిద్వివిధం- లఘునాగురుణాతథా - లఘుక్రమంమందవారే కల్యాణేగురుపద్ధతీ ॥ ఏకాదశ్యాంతుసంప్రాప్తే - షకాంతంవర్జయేత్సుధీః ॥ ఏవంవైకుంఠమార్గస్య లక్షణంవర్ణితంమయా॥

అథగురుధ్యానం,

శ్లో॥ శ్రీమద్విజయరామంచ - శ్రీనివాసంతపోనిధిం- శ్రీకృష్ణంచనృశింహ్వంచ - సుబ్బరాయాభిదంగురుం - విద్యాగురుంసుబ్బరాయం సర్వాన్మత్వాగురూన్తథా। నిత్యోత్సవప్రకరణం -కరిష్యామి తదాజ్ఞయా ॥

శ్లో॥ గురుర్బ్రహ్మ - గురుర్విష్ణుర్గురుదేవోమహేశ్వరః - గురుసాక్షాత్పరబ్రహ్మ - తస్మైశ్రీగురవేనమః ।
గురురేవపరబ్రహ్మ - గురురేవపరంధనం - గురురేవపరంధామ్ను తస్మైశ్రీగురవేనమః ॥

హిందూస్తాని కాపిరాగము—ఆదితాళము,

గురుమహారాజ - గురుమహారాజ - విజయరామసద్గురుమహారాజ ॥ వేదశాస్త్రములు వేదాంతంబులు - వెదకిసారముల - వివరించినస॥ద్గురుమహా ॥౧॥ కులములుమతములుగూలద్రోచిశ్రీ- నిలయునిధర్మపైనిల్పినమౌన ॥ద్గురుమహా॥ ॥౨॥ శ్రీశూద్రాదులదోసములనువిడ - జేసిమిగులసం - శీలులజేసిన ॥గురు॥ ॥3॥ కామముక్రోధముగాలిచిపట్టాభిరామదాసునిరంజిలజేసిన ॥గురు॥ ॥౪॥

## శివప్రార్థనము.

శ్లో॥ శివంవైష్ణవమత్యంత - భగవద్భక్తిసంయుతం - విష్ణుపాదోదకైస్స్నాతం-విశ్వేశ్వరమనామయంరామమంత్రానుసంధానేరమయంతం ముహుర్ముహుఃకాశ్యాంరామేశ్వరేచాపిగంగాస్నానవ్రతం భజే ॥

## మధ్యమావతిరాగము—ఆదితాళము

శివశివశంకరశంభోపాహి - శివశివశంకరశంభోపాహి ॥౧॥ శివశివశంకర - చిత్తవశంకర - భవనాశంకరభక్తిందేహి ॥౨॥ భక్తజనావనపాపవిదళన ॥ ముక్తజనాశ్రయముక్తిందేహి ॥౩॥ పేరాలాహ్వయప్రియపురనిలయ - సారాసారవిచారణహృదయ ॥౪॥

## శ్రీరామానుజ ప్రార్థన.

శ్లో॥ విశిష్టాద్వైతకర్తారం- శ్రీవైష్ణవశిఖామణిం।
శ్రీమద్రామానుజంమన్యే - శ్రితదోషభయాపహం ॥

శ్రీమతేరామానుజాయనమః

## మారువరాగము-- ఆదితాళము,

రామానుజాయిందురావే॥శ్రీరామానుజా॥ యిందురావే ॥౧॥ పామరుడననన్ను పాలింపుదువుగాని।రా॥॥౨॥ కాషాయవస్త్రముల్ గట్టుకొండువుగాని ॥రా॥ ॥౩॥తిరుమణిశ్రీచూర్ణం - దిద్దిపోదువుగాని ॥రా॥ ॥౪ తిరుమంత్రమున్నమాకు - తీరచెప్పదుగాని ॥రా॥ ॥౫॥ ద్వయ

మంత్రమార్థము - దయ శేయుదువుగాని॥ రా॥౬॥ చెరమార్థములు వేగ జెప్పిపోదువుగాని ॥రా॥ ॥౭॥ శంఖచక్రములు మాచాతనుంచుదుగాని॥రా॥౮॥ రామాయణార్థంబు - రా జెప్పుదువుగాని ॥రా॥ ॥౯॥ భాష్యంబులను తెన్సు - భాషింపుదువుగాని ॥రా॥ ॥౧౦॥ అష్టాక్షరంబులనవరబలుకుదుగాని ॥రా॥ ॥౧౧॥ విష్ణుస్వరూపంబు - వినుపింపుదువుగాని ॥రా॥ ॥౧౨॥ వేదాంతములు రెండు - వాదింపుదువుగాని ॥రా॥ ॥౧౩॥ శ్రీరంగముకు నన్ను । జేర్చుకొందువుగాని ॥రా॥ ॥౧౪॥ మేలుకోటకు సీతో దోలుకపోదువు ॥రా॥ ॥౧౫॥ శ్రీపట్టణముకు - మళ్లీ వచ్చెదగాని ॥రా॥ ॥౧౬॥ వేంకటాచలమును వేగ సేవింతుము ॥రా॥ ॥౧౭॥ తిరుకచ్చినంబితో - తీరుగానుందుము ॥రా॥౧౮॥ గోష్ఠిపూర్ణులతోడ - గోష్ఠితోనుందుము ॥రా॥ ॥౧౯॥ యామునాచార్యుల - నీమము నిలుపుదు ॥రా॥ ॥౨౦॥ కూరనాథునితోనక - జేర్చిపోదువుగాని ॥రా॥౨౧॥ దాశరథికి నన్ను - దాసిగ జేతువు ॥రా॥ ॥౨౨॥ గద్యత్రయము నిక - పద్యము గబలికెదు ॥రా॥ ॥౨౩॥ కైంకర్యములు చెప్పి - కృపచేర్చుదువుగాని ॥రా॥ ॥౨౪॥ వేదసారములను - వెదకిబోధించెదు ॥రా॥ ॥౨౫॥ కంచి పట్టణమున - మంచితోనుందుము ॥రా॥ ॥౨౬॥ పట్టాభిరాముని - కష్ట మీడేర్పవు ॥రా॥ ॥౨౭॥ ఇంకొల్లుపురిన - నిశ్చింకనుందుముగాని

లక్ష్మీప్రార్థన.

శ్లో॥ భగవత్ప్రసాదశ్రేష్ఠార్థం - భావయామి సదాశ్రియః ।
భుక్తిముక్త్యన్నదేవానాం - కృత్యానాం కారణాని చ ॥

ఆనందభైరవి — అట.

అలమేల్మంగమ్మ నీయాశ్రయించితినమ్మ కులమెల్ల బ్రోవవమ్మా

జలజభవాదులుశరణుశేయగమిమ్మ - నలినాక్షునకుమనసునాటఁజల్పి
తివిగ ॥౧॥ యీషణత్రయములదోషములనుజిక్కి - దూషణాదుల
జేయుచు - భూషణాంబరములభోగముచేస-ద్భాషణలుడిగినపాపిష్టినో
యమ్మ ॥౨॥ గర్భములోపలకష్టమొందుటచేత - యర్భకతరుణాద్య
వస్థలచేత స్వర్భానుచేబడ్డసవితృచందము - దుర్భరత్వమునుంటి
నిర్భయునిజేయవే ॥౩॥ పుట్టుచుగిట్టుచుపూరినిమేయుచు -
పట్టరానిబవ్వపైబెట్టుకొనుచు ॥యిట్టులజన్మము- లెన్నెన్నోయెత్తుచు
పట్టాభిరామాఖ్యప్రబలితినేటికి ॥అలమేల్మంగమ్మ॥

## హిందూస్తాని రాగము—ఆదితాళం

మంగళమనరేమాధవునకుమంగళమనరేమాధవునకు -
అంగనలందరు- హారతిబట్టుక ॥మం॥ ॥౧॥ సుందరమూర్తికిసుగుణసం
పూర్తికిమందరధారికిమహితసత్కీర్తికి - ॥మం॥ ॥౨॥ నరసయపుర
మునవాసుడై వెలసిన పరిమళగాత్రునకు - పరమపవిత్రునకు ॥మం॥ ౩

## పరాకులు

శ్రీమదఖిల లోకైశ్వర్యకర సౌందర్యలావణ్యయౌవన
గాంభీర్యధైర్యస్థైర్య విలాస విభ్రమావిర్భూత - దివ్యమంగళవి
గ్రహ ॥బహుపరాకు॥౧॥ అప్రాకృతపంచోపనిషన్మయనిత్యనిరవద్య - ది
వ్యభవ్యసుందరశరీర ॥పరాకు॥ ॥౨॥ యశోదాసుందరీసుందరముఖకమల
సూర్యోదయ ॥పరాకు॥౩॥ శ్రీరుక్మిణీసత్యభామామనోహరాపరాకు॥౪॥
శ్రీమద్ద్వారకాపట్టణసౌధాంతరవిహారా ॥పరాకు॥౫॥

## రేగుప్తిరాగము—అట

వేంచేసెనమ్మలారా - వేదాంతవేద్యుడువేంచేసెనమ్మ

లారా॥ వేంచేసెనమ్మ లారవేదాంతవేద్యుడు - పాంచభౌతికమయి నశ్వరబలదేహములతో ॥ వేం ॥ ॥౧॥ గుణహీనుడై యుంటగుణముగావనుకొని - అణుమాత్రుడగుహరియధికరూపము నొంది-॥వేం॥౨॥ పాకాయుడై యుంటసాధుగుణంబని యేకాకృతినివిడచి - యిలనువేవిధముల ॥వేం॥౩॥ పరమపదముకంటే-బాగగునెళవనినరసయపురమందుసరిసాళ్లిమెచ్చగ ॥వేం॥ ॥౪॥

(శ్రీస్వామివారు భజనకూటంబున సుఖాసీనుండై యున్న యనంతరంబు)

## సురటరాగం—ఆది

శ్రీనివాసాయతేమంగళం - శ్రీకృష్ణాయతేమంగళం _కమలారమణాకంజాతచరణవిమలాభరణతే - మంగళం ॥శ్రీ॥ ॥౧॥ పావననామపాలితశోమరావణభీమతే మంగళం॥ శ్రీ॥ ౨॥యింకొల్పురీశ - యిహపరమేశ వెంకటవాసతేమంగళం ॥౩॥ శ్రీనివాసాయతే॥

## పరాకులు.

౧॥ శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయక ॥౨॥ ఆశ్రితవిద్వజ్జనాధార బహు॥ ॥౩॥ అతసీకుసుమాభశరీరాపరాక్ ॥౪॥ సర్వలోకైకశరణ్య॥బహుపరాక్ ॥౫॥ అశేషజగన్మోహనాకారాబహుపరాక్॥

శ్లో॥ తుర్యాతీతందుష్టచిత్తైశ్చ గీతం - మాయాతీతంమాయినంవేదవేద్యం-శాంతంకాంతంజ్ఞానమానందరూపం॥యేకంనాకంలోకనాథంనమామి॥

## పరాకులు

నిత్యోత్సవాంగత్వేనచతుర్వేద పారాయణమవధారయ.

యజుర్వేదము.

శ్రు॥ హరిఃఓం॥ఇషేత్వోర్జేత్వా వాయవస్థో* * *సశూరేపాహి॥

ఋగ్వేదము.

హరిఃఓం॥అగ్నిమీళేపురోహితం * * *రత్నధాతమం॥

అథసామవేదపారాయణమవధారయ

హరిఃఓం ॥ అగ్నఆయాహి * * * బర్హిషి॥

అథ॥ అథర్వణవేదమవధారయ ॥

హరిఃఓం ॥ శన్నోదేవీరభిష్టయ * * * భిస్రవంతునః॥

చతుర్వేదపారాయణానంతరే ద్రావిడవేదపారాయణమవధారయ

పల్లాండుపల్లాండుపల్లాయిరత్తాండు పలకోడినూరాయిరముష్పల్లాండు

తిణ్డోళ్ - మణివణ్ణావున్ - శేవడిశెవ్వితిరుక్కాప్పు ॥

నీవు యెల్లకాలము క్షేమముగా నుండవలయునని ప్రార్థన

అడియోమోడుం నిన్నోడుంపిరివిన్రియాయిరం పల్లాండు ఎడివా

య్ సింగవలమూర్ పినిల్ వా గిన్నమున్తె యుంపల్లాండు వడివార్ శోదివ

ల్లతుత్తై యుఇ్నడరా యుంపల్లాండు పడైపోర్ పుక్కుము గుపవా

ఇ శన్నియము ంపల్లాండే ॥

అనంతకాలము నీవు నీభార్యయగులక్ష్మీదేవి నీ శంఖచక్రంబులు - నేను

యల్లసుఖంబులతో నుండవలయునని ప్రార్థన ॥

ద్రావిడవేదపారాయణానంతరే ధర్మశాస్త్రపఠనమవధారయ

శ్లో॥ కలౌకల్మషచిత్తానాంపాపద్రవ్యోపజీవినాం- విధిక్రియావిహీనా

నాంగతిర్గోవిందకీర్తనం।

ధర్మశాస్త్రపఠనానంతరే భారతపఠనమవధారయ

శ్లో॥ యస్యస్మరణమాత్రేణ జన్మసంసారబంధనాత్ విముచ్య

తేనమస్తస్మైనిష్ణవేప్రభవిష్ణవే ॥

॥భారతీపఠనానంతరే భాగవతకాలక్షేపమవధారయ॥

శ్లో॥ నన్(స్త్రీ)నషండో నపుమాన్న జంతుః ॥ నాయంగుణఃకర్మనసన్న చాసన్నిషేధశేషోజయతాదశేషః ॥

భాగవతకాలక్షేపానంతరే - రామాయణపారాయణమవధారయ

శ్లో॥ అలంవివాదేనవమానుషోయం।రామాత్మనారాక్షసమర్దనాయ భుజంగశయ్యాంపరిముచ్యసాక్షాన్నారాయణోభూతలిమాజగామ॥

రామాయణకాలక్షేపానంతరే భజనకాలక్షేపమవధారయ ॥

శహానరాగం — ఆదితాళము.

సేవింపుముమనసా ॥ శ్రీహరిని॥ సేవింపుముమనసా॥ సేవింపుముమనచింతలు [illegible] -పరిపరివిధములు ॥సే॥౧॥ పుణ్యాభిరాముని-పాపముబాపన్-కష్టములుగట్టెక్కి-బయలువెడలువాని ॥సే॥ ౨

రాగంకల్యాణి ఆదితాళం

రామనామమనుమందునుగొనరే ॥ రామామణులారా॥ పేరిమమీరనదిప్రియముసదినదిన - కామజ్వరములుగాలిచివేసును ॥రా॥ ॥౧॥ జ్ఞానులనిచెడుసానునూరుక - దుర్జనులనియెడు - మజ్జిగనంటక ॥రా॥ ॥౨॥ వైదికులనియెడువైద్యులదగ్గర -వేదశాస్త్రములువెదకితెచ్చినది ॥రా॥ ॥౩॥ విష్ణుభక్తులనువీధులనమ్మెడు -వైష్ణవరసమిదివనరుగనుండును ॥రా॥ ॥౪॥ మదమత్సరములుమాడిచివేసును - పదపద్యంబులు - పథ్యముజేస్తుక ॥రా॥ ॥౫॥ మంచిమనంబనుసంచిననుంచుక-కొంచముకొంచముగొనినమేలగు ॥రా॥ ॥౬॥ తృష్ణలనెడుశీతోదకమం

టక - కృష్ణాహరియనుయుష్ణోదకమున ॥రా॥ ॥౭॥ నియోగిదినినను - నిష్టనుబో దనుచునియోగి కత్రేగొప్పగనుండదు ॥రా॥ ॥౮॥ వైదికునింటను - వనుచునుబ్రైను పరయతనియోగిసరముగనుండెను ॥రా॥౯॥ రామనుభకు లెప్పుడు బిచ్చనుకాముకులకుయర- కొసునునివ్వని॥రా ॥౧౦॥ భీమబ్రహ్మకి - నాగవాదుబును - కోరిభుజియించిన - గొప్పయొమధబు ॥రా॥ ॥౧౧॥ శ్రీకరుడనునాశాంకరిఁజవియు - కింకరులైబహుకీర్తించినశ్రీ॥రా॥ ॥౧౨॥ యుత్తముడౌయాదత్తాత్రేయులు - విత్తనముగహృద్వీధినలిపిన॥రా॥ ॥౧౩॥ యీామహిపట్టాభిరాములనడిగిన నీమముతోడుత - నిత్యమునొసగును ॥రా॥ ॥౧౪॥

శ్రీమతేనారాయణాయనమః

శ్రీమదాపస్తంభసూత్ర కౌశికసగోత్ర గంగవర వంశపయఃపారావార రాకాసుధాకర వేంకటరాయ యోగీంద్రప్రపౌత్ర కృష్ణ యోగీంద్రపౌత్ర సుదర్శనసూరిపుత్ర పట్టాభిరామదాస శర్మ హృదయాంతర్గత భగవద్విరచిత శ్రీవైకుంఠ మార్గంబునందు భగవద్భాగవతాచార్య స్తవంబను ప్రథమమజిలీ సంపూర్ణము.



శ్రీరస్తు.

రెండవమజిలి

పూజావిధానము

# శ్రీవైకుంఠమార్గము.

శ్రీమతే నారాయణాయ నమః.

శ్లో॥ శాంతాకారం - భుజగశయనం పద్మనాభం - సురేశం - విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగం - లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం - వందేవిష్ణుం భవభయహరం - సర్వలోకైకనాథం॥

ఇష్వాకంబున

సీస॥ ధ్యానంబు చేసెద [illegible] - ఆవాహనము చేతు నాత్మహారమ॥ సింహాసనము ఇచ్చి [illegible] - పాద్యంబు నొసగెద

పరమపురుష-యఘ్యంబు నొందుము-యాగమసంసార-యాచమనీ యంబునారగించు-మధుపర్క-మునుమిగుల-మాధవాగయికొను -స్నా నము సేయింతు-సరసముగను స్లోత మొనరించిబంగరుపట్టమిత్తు- నుదు టకస్తురితిలకంబు -ముదమునొంద నలదియజ్ఞోపవీతంబు-నైతరముగ- ధారణము వెగ జేయించివందమిడుదు॥

అనందభైరవిరాగం—అటతాళము.

చందనమిచ్చెదగొనుమా - నీదుసుందరాంగమునందు-సొగస గురుగనుమా॥చం॥నందనందన -గోవిందపరాత్పర-సుందరవదనముచు- సుందవగదహరి ॥చం॥ ॥౧॥ అస్త్రమానపుపేళకుబ్జ - కుటిలహాస్తము తోనిచ్చె - సనకగ్గై కొనవే ॥ కస్తూరితోగలసి - ఘుమఘుమలాడుచు - సిస్తుగనున్నది - చిరకాలమయ్యాని ॥చం॥ ॥౨॥ కరుణతోమముజూడ రాదా-దాసవపలనముమును బ్రోవ లేదా।ధరలోపట్టాభిరామ - దాసుడ ర్పించెను-ప మెలింపుచుపరము-పావనమయ్యెండె॥చం॥

శ్లో॥ అష్టయిశ్వర్యమవాప్నోతి-సువర్ణాభరణార్పణే ॥ తస్మాత్సకలసౌ వర్ణభూషణానిదదామితే ॥ గోవిందమాధవానంత - గోపాల కసురేశ్వర - గ్రాహ్యగ్రాహ్యావిసృజ్యాథ । సర్వంగ్రాహ్యంమ దర్పితం ॥

నాటకురంజి—ఆది

ధరించుమిా దశరథనందన-ధరించుమిా॥ ధరించుమిాసిరి-వరించి- నాభిన విరించినీగన్న -పురంజియావన ॥ధ॥ ॥౧॥ అరూపుడై య్యానుప రూపుడగుటను సురూపమగు - దివ్య -కీరీటమిచ్చితి ॥ధ॥ ॥౨॥ పంకజ

ముఖులిరు-వంకలమెరయగ-శంఖచక్రములు-పొంకముతోడుత॥ధ॥ ॥౩॥ బంగరుమొలనూ-లుంగరములుమెరుంగుల-వెలుగగ - యంగనసమితి తో. ధ॥౪॥నికరములనదగు-మకరకుండలము-లోకిరియాయము- రొయి సంగతినిగద॥ధ॥౫॥అజరుద్రాదుల-కభయంబొసగెడు - భుజయుగ్మంబుల ॥భుజకీర్తులను॥ధ॥౬॥ మాణిక్యంబులమకరకంఠినీ-యణుమాత్రముగా నాలోచింపక॥ధ॥౭॥ నరసఖుయింకొల్పురమునబుట్టిన-హరిదాసులకును శివలోసగుటకై ॥ధ॥ ॥౮॥

శ్లో॥ పుష్పంస గంధయుక్తేన- యధాసర్వత్రరాజతే-తథాపుష్పప్రదా
తాచ-బుద్ధిముక్తావిరాజతే

రాగము॥ శహాన—ఆదితాళము.

పువ్వులపూజింతునవ్వులుగాపుసుమి - మువ్వురుమూర్తులకు మూలమయినవాని - పువ్వులపూజింతుగోపాలునినే. ॥పు॥ ౨॥ యింకొల్లుపురమునపంకజములుదెచ్చి । వెంకటరమణానావంకజూ ఢరయని ॥పు॥ ॥౩॥ ప్రేమతోపట్టాభి రామదాసునకు -కామితమిమ్మని కాంతిగల్గినమంచ్చి ॥పు॥ ॥౪॥

శ్లో॥ సువాసనాప్రదానేన - సుగంధీ - సుఖవాగ్భవేత్ - తస్మాద్ద
దామిహారయె - ప్రధూమంచసువాసితం ॥

భైరవిరాగం—ఆదితాళము.

సాంబ్రాణిఖడ్డీలనుసరిగావాసనజూడుము - సాంబ్రాజ్యపు - సమయం బున-సభలనుగైకొనినరీతి ॥సాం॥ ॥౧॥ కాలాగరుకర్పూరముకస్తూరిచం దనమును-చాలాగాగలపినవె-చక్కనిపరిమళములుగల॥సాం॥ ॥౨॥ ధ

రగో - చమత్కారపురమున - వరదుఁడై వెలసినహరి - కరుణను భట్టాభి రాముని - సుంతంబులదోలుటకై ॥సా॥

శ్లో॥ యన్నామకీర్తనేనాపి ప్రాణాంతక్షణేనవినశ్యతి ।
తన్నామసంకీర్తనేన - సర్వంపాపంహరిష్యతి ॥

సురటిరాగం—ఆటతాళము.

దీపమిచ్చెదజాదర - నాడు - పాపములెడబాపర - శ్రీపతి నేనీపదములనేపొద్దు చింతింతునుహరి ॥దీ॥ ॥౧॥ ఆవునెయ్యిబోసితి - యధికభక్తిజేసితి - పావనమగుముమ్మాడువత్తులబాగుగ వెలిగించుచుండెడు ॥దీ॥ ॥౨॥ వాసిగ చెమత్కారపురని - వాసుడవై నావసీ-భూసురభట్టాభిరామ-దాసునిదయసేలుదుపసి ॥దీ॥ ॥౩॥

శ్లో॥ కదళీనారికేళాదిసర్వపక్వఫలానిచ । దధిక్షీరసమాయుక్తం - నవనీతాదికంతథా । భక్ష్యభోజ్యాదిభిర్యుక్తం - నానాశాల్యోదనానిచ - సమర్పితంమయాధాత్ర భక్త్యా - భక్త్యాగృహాణ పాణినా దధ్యోదనంచపక్షీరాన్నం - చిత్రాన్నంసుపచింతథా ఆమ్లాశనంచసుకరమప్పయాంమిదినేదినే - శ్రీభూనీళాదిభిస్సార్ధం వైర్నిత్యసూరిభిస్సహ తథా - సుఖాసీనస్స్వస్థచిత్తో సంగృహాణజగత్పతే॥

శ్రీరంజనిరాగం—ఆటతాళము.

ఆరగింపుము పటిపండ్లు - అందమైనమామిడిపండ్లు - యేరికోరి తెచ్చియుంచినక్షీరములనారికేళముగ ॥ఆ॥ ॥౧॥ పంచభక్ష్యములుంచినాను పంచదారయుగలపినాను - కొంచమైనకొసగించక - మంచిమంచిది గొంచుకొనుము ॥ఆ॥ ॥౨॥ పచ్చికొబ్బరిపటికికెల్లము - తెచ్చియిచ్చిన మెచ్చుకో

నప్పుముచ్చటకుకు చేలుకిచ్చిన-పచ్చుటటకులబుచ్చుకోగవో ॥అ॥౩॥ యెంగిలిపండ్లు శబరిచేత-మంగళముగాముద్రించిగినావు-ఏంగనే మరే౦బొందగియుండిన-రంగుగభుజియింపవేమో ॥అ॥ ॥౪॥ ధరణిలో భద్రాద్రి రామదాసునిపై కరుణలేదో-చరణములనునమ్మికొన్నుశరణువిడువకున్నవాడ ॥ఆరగించు॥ ॥౫॥

కం॥ పిడికెడువడపప్పునుచా-రెడుపానకమిడినతృప్తి లేదేకోపబుడికి దయజూచితే - బిడియ పడుతప్పదు జేయవలెనో - దినకరతేజ

బిలహరిరాగం—ఆదితాళము.

పానకమిచ్చెదగొనుమా - పాడకు - జ్ఞానమునొసగుము రామా ॥పా॥ ॥౧॥ పానకమిచ్చెదజ్ఞానము నొసగుము - మానకనినునామ మినదలంచెదను ॥పా॥ ॥౨॥ యాలకులునుమిరియాలులవంగాల్ - చాల పొడుముజేసిచక్కగ కలపిన ॥పా॥ ॥౩॥ మంగళగిరిలోనంగనతోడ శృంగముమీరగనుయారగించవో ॥పా॥ ॥౪॥ పానపొత్తునకు-తవడమిప్పను - వడిగభుజింపుము - తడవుజేయకుము ॥పా॥ ॥౫॥ శ్రీమద్భద్రాద్రి రామదాసునకు - కామితమిచ్చెడు ఘనుడవనుచును ॥పా॥ ॥౬॥

కం॥ ఆకులుపోకలుసున్నము - శ్రీకరముగయాలకులును - జేర్చియవంగాల్ - మీకై నేయర్పించెద - నాకిపుడు తోడవిడేము - నందుము ॥కృష్ణా॥

శ్రీరాగము—అటతాళము.

తాంబూలమిదిగో-దానవవైరి ॥తాం॥ తాంబూలమిదిగోత ద్దయుతోడనైకొనర - సాంబశివార్చిత - సకలసజ్జననుత ॥తాం॥౧॥

యింకొల్లనగరులో పంకేజాక్షులగూడి - శంకలేనియు లేక - చర్చ చే యుటకునై ॥తా॥

క॥ మంగళహారతులొసగెద - పంగళంలు మాకొసగిమమ్మేలుము యోమంగళదైవతనాయక - మంగళములలో సనీవుమంగళము గదా॥

సురటరాగము—అట

గరుడవాహనునకు కమలావివాహునకు- మంగళ జయమంగళం ౧రాజగోపాలునకు తేజోవిశాలునకు-మంగళంశుభమంగళం॥౨॥రవిసో మనేత్రునకు రమణీయగాత్రునకు- మంగళం॥శుభ॥౩॥గానలోలునకు కరు ణాలవాలునకు- ॥మం॥ ॥౪॥ పేరాలనిలయునకు పీతాంబరునకు ॥మం॥౫॥ శ్లో॥ మంత్రపుష్పంప్రదాస్యామి - మంత్రాధీనంతు దైవతంతస్మాన్మం త్రం - ప్రవక్ష్యామి - సర్వకాలంముముక్షుభిః॥

కమాచ్ రాగం—ఆదితాళము.

సువర్ణమంత్రపుష్పంబిచ్చెదసూర్యశశినేత్రా ॥అవర్ణరూపుడ వైనను నేనిను - భువిపూజించినకారణమున నే ॥సు॥ ॥౧॥ బ్రహ్మాదు లునునీవే - కర్మాదులునునీవే బ్రాహ్మణులునునీవే - బ్రహ్మము నెరిగిన బ్రాహ్మణుడయితె - బ్రహ్మను వేరెబయలుగదలచును॥సు॥ ॥౨॥రుద్రా దులునీవే - రుద్రాణులునునీవే - రుద్రాంతకుడనీవే - భద్రాదులును నీవే - భద్రార్థులునునీవే - భద్రాద్రిగాకను - ప్రబలెదునాడవీవె - సు॥ ॥౩॥ యింద్రాదులునునీవె-చంద్రాదులునునీవె-యిందిరాపతివీవే సంద్రాదులునునీవె - సకలనదులునీవె - మందరధారినీమహిమనేమన వచ్చు ॥సు॥ ॥౪॥యిలనుపట్టాభిరామునింటను వెలసినవినాథుడవీవెగా -

కులములుబలములు - జలములుస్థలములు - నిలయములును- మరినీవెగదా ॥హరి॥ సు॥ ॥౫॥

## తంగంపాట.

ప్రదక్షిణము సేతు - పాతకములబోతు - నాదిక్కు నూజూడుమూవో మాధవా - నన్ను రక్షించుసుమా ॥౧॥ నాదిక్కు జూడుమా - నన్ను రక్షించుమా - యేదిక్కు నెరుగనుమావో మాధవా - ఇపుడైన స్నేలుకొమ్మా ॥౨॥ పాపుడకోపుడను పాప-సంభవుడను - తాపమును బాపరావో మాధవా - ప్రాపునీవేనంటిరా ॥౩॥ శరణార్థినంటిని - చేపట్టుమంటిని - కరుణచే వీక్షింపరా - వో మాధవా - తరుణమిదేనంటిరా ॥౪॥ యింకొల్లు రీశ్వరా - యిందిరామనోహరా ॥ పంకేరుహాక్షా హరీ ॥ వో మాధవా వెంకటరమణా మురారీ ॥ప్రదక్షిణము॥౫॥

శ్లో॥ యానికానిచపాపాని జన్మాంతరకృతానిచ - తానితాని ప్రణశ్యంతు ప్రదక్షిణపదే- పదే। పాపోహం పాపకర్మాహం పాపాత్మా - పాపసంభవః - త్రాహిమాం కృపయా దేవ - శరణాగతవత్సల । అన్యథా శరణం నాస్తి - త్వమేవ శరణం మమ - తస్మాత్కారుణ్య భావేన - రక్షరక్ష జనార్దన -

యిట్లు భగ స్తవము అనంతరమందు - శ్రీలక్ష్మీదేవిస్తవము - ఆయనంతరమందు ఆంజనేయాది పరమభాగవతస్తవము - సమస్త పనులయు

శ్లో॥ అపరాధసహస్రాణి - క్రియంతేహర్నిశం మయా దాసోయమితి మాం మత్వా క్షమస్వ పురుషోత్తమ ॥

## ఉపన్యాసము.

శ్లో॥ తులసీకానన యత్ర - యత్ర పద్మవనాని చ॥ వసంతి వైష్ణవా యత్ర

తత్రతత్సన్నిహితో హరిః - యనియు - మద్భక్తాయత్ర గాయంతి తత్రతిష్ఠామి నారద యనియు వుండెడు యీలాటి ప్రమాణంబులవలన భజనకాలక్షేపస్థలమందు భగవంతుడావిర్భవించియుండునని తెలుపబడుచున్నది - గావున యర్చావతారరూపముగా శ్రీస్వామివారిచ్చట వెంచేసియుండి సేవకులకును సర్వాభీష్టంబుల సమకూర్చుచున్నారని యనుగ్రహింపుచున్నారు - గావున మీమీ యభీష్టంబులు తెలియునటుల ప్రత్యేక ప్రత్యేకముగా స్తోత్రంబు జేసుకొనుచుండిని ధర్మార్థకామమోక్షంబులంది సుఖంబు జెందరు॥

## ప్రార్థనలు.

క॥ నీ పాదకమల సేవయు నీ పాదార్చకులతోడి నెయ్యమును - నితాంతాపారభూతదయయును - తాపసమందారమాకు దయసేయగదే॥ అని యీలాటివియు। యింకా వారి ఇష్టానుసారముగా నుండునవి యుపకరింపవలయు॥

### విడివిడిగా పద్యంబులు సన్నిధిలో బాడుడు

కందార్థం॥ శ్వేతచ్ఛత్రంబిచ్చెద - పాతకములనణచి నన్ను పాలింపుము మీ - ఘాతకుని గాదలంపక - మీతో డెశరణుజొచ్చి - మిమ్మునమ్మినారా। సితాపత్రయము బ్రోవవేరా - సమయము తప్పనిసే చాలగ వేడిన। భ్రమనొందించెదమ గాని - భయము బాపగనైతి। నిను॥

### శహాన రాగం - ఆదితాళం.

వింజామరము వేతుర గోవిందా। వింజామరము వేతుర। వింజామరము వేతు విశ్వాసముంచవె - కంజాత నేత్ర - శ్రీకాంతా కళత్రనే॥వి॥౧

పరాకులు॥ ఆశ్రితపరిపాలా। గోపాలా। యఖిలజనాధారా - స్వశ్రేయ
సమునాకు సమకూర్చెదవని - యాశ్రయించితిని। యాగమసంచార ॥పం॥
పరాకులు॥ రాక్షససంహార। సుకుమారా - రాజితమణిహారా। యీక్షితి
నుండెదు। యినకోల్ పట్టణ-మీక్షించి రక్షించవే-యినశశినేత్ర సే॥పం॥

కందార్థము.

నృత్యము జేసెద సభలో - సత్యంబుగ కరుణజూడు సకలాధారా
ప్రత్యక్షము నీదు సన్నిధి నత్యంతరి మేమి లేక మనసీయవే యయ్యా - యిలనే
మీయగ ననీయక యయ్యా। వనజలోచన నేనీ। వాడను గావున - వినువారి
గనువారి విఘ్నగాదలతును॥ మనసీయ॥

కందార్థం.

గానము జేసెద నాపద। గానంబుల సభలలోన గనుగొందువుగా
మానందమంతకంటెను। మానంబుగ దోచుచుండు। నూవినవయ్యా-భా
వములోన। భావింపవయ్యా॥ పావనన్నామ నీకీవిధమున బాడి। సేవసేయు
చునుండె। సేవకుడను గనుక॥ నూవినవయ్యా॥

మధ్యమావతిరాగం—అట

పల్లకి నెక్కుము - పాపవిమోచన - వల్లవిగ్రహము। పల్లకితు
వుగాని - పల్లకి నెక్కుమయ్యా। శ్రీకృష్ణయ్యా। పల్లకి నెక్కుమయ్యా ౧॥ రా
ళ్ళలోన నడచిపో-రాదు దారలకిట్లు। కాళ్ళు గందెనని। కాంతలుగుసి సెటు॥ప॥
॥౨॥ యింకోల్లు పురిలోమన। యింతపల్లన్న రీతిగ - పంకము లేకుండ। బాగా
నుండదు దారి ॥ప॥ ౩॥ రవ్వాయిన పట్టాభి। రామదాసుని మాట। లెవ్విధము
నవినక। నిట్లు చరింతువు ॥ప॥ ౪॥

దర్బారురాగం__అట

అశ్వారూఢము జేయుము। అయ్యా శ్రీరామయ్యా। ఘనతి జేగము నబోదువు

విశ్వము పాలించి వేవేగ రావలె - శాశ్వతముగనుండ - జనదెచ్చటను గాని॥ అ॥౧॥ యింకొల్లుపురమునయందిరాపతి గూడి పంకజములపూజ బాగా నొంది - వెంకటరమణాఖ్య నెలయుచుండెను గాని - సంకటపడకవద్దు సకల దేశములందు ॥అ॥౨॥ ధరలోపట్టాభిరాము దాసునియింటను - సరియయినపూజలు జరుగునీకు - పరస్పరములయందు బాగానుండుము - నహూర్యోదయమునకు సుఖముగ జేసుము॥అ॥౩॥

అసావేరి రాగం—అట.

యేమనిసాహసమెక్కితివి గనాదె - యిందిరాపతిశోకే - మానాభిమానములు మదిలో దలంపవు - నానాటికిని - పెరుగుచును మదిరిగేవు। ॥యే॥౧॥ జంఘారిసంగతి। చక్కగవినలేదా। యంభోరుహానయన - అంఘారివేశిన। సైరావతము నెక్కి - కుంభభవాదుల। గూడిసుఖింపవో॥౨॥ అష్టదిగ్గజములు। నయిన శేషాద్రిపై నివసించగా - యిష్టముగానున్నని కొల్లపురమున - పట్టాభిరామాఖ్యభక్తమానసమునే ॥యే॥౩॥

కేదారగౌళరాగం—ఆదితాళం.

తేరెక్కి తిరిగెవు - తిరుగనుండుము తిరుమలరాయహరి॥ నారెకు చెప్పివే। సారిసనిచెవి। దూరదదో మో। సారసలోచన॥౧॥ తేరువిడచియుడని। దూరభూములనెల్ల - దారతో తిరిగితిగా। కోరికదీరదో - నారదసన్నుత - సేసుపుగలిగిన - నిజమయినబంగారు। తేరెక్కి॥౨॥ వసుధనింకొల్లపట్టణ। నేశుడవయియుండె - కనుపులోదిరుగ నేలా। యనయానదేహము కరిగించిబోవును - రసికుడనెతివో - రమణీయముగనుండె॥ తేరెక్కి తిరిగి॥

తే॥ ఛత్రం సమర్పయామి। చామరాన్ సమర్పయామి - నృత్యం సమర్పయామి - గీతం శ్రావయామి - ఆందోళికమారోహ

యామి - అశ్వారూఢంసమర్పయామి - గజారూఢంసమర్ప యామి ॥రథారూఢంసమర్పయామి గరుడారూఢంసమర్పయామి - సర్వోపచారాన్ సమర్పయామి।

మంత్రహీనంక్రియాహీనంభక్తిహీనం - జనార్దన - యత్పూజితంమయాదేవ - పరిపూర్ణంతదస్తుతే। మంత్రమధ్యే క్రియామధ్యే॥ విష్ణోస్స్మరణపూర్వకంయత్కించిత్క్రియతేకర్మతత్కర్మసఫలంభవేత్

రాగం—యేకతాళం

నారాయణనారాయణనారాయణ-శ్రీమన్నారయణనారాయణ నారాయణహరిహరి॥నా॥ శ్లో॥ నారాయణేతిమంత్రోస్తివాగస్తివశవర్తినీతథాపినరకేఘోరెపతంతిత్యేతదద్భుతం ॥ శ్లో॥ కాయేనవాచా మనసైంద్రియైర్వాబుద్ధ్యాత్మనావా ప్రకృతేస్స్వభావాత్కరోమి యద్య త్సకలంపరస్మై నారాయణాయేతి సమర్పయామి॥

తత్సబ్రహ్మార్పణమస్తు

శ్లో॥ డోలాయమానంగోవిందం ॥ మంచస్థంమధుసూదనం - రథస్థం కేశవంవంద్య - పునర్జన్మనవిద్యతే॥

గద్య

శ్రీమదాపస్తంభసూత్ర - కౌసికసగోత్ర - గంగవరవంశపయః పారావారరాకాసుధాకర వేంకటరాయయోగీంద్ర ప్రపౌత్రి - కృష్ణయోగీంద్ర పౌత్రసుదర్శన సూరిపుత్ర పట్టాభిరామదాసశర్మహృదయాంతర్గత భగవద్విరచితంబయిన శ్రీవైకుంఠ మార్గంబునందు ధ్యానావాహనాది పూజా విధానంబను రెండవ మజిలీ

సంపూర్ణము.

శ్రీ



శ్రీరస్తు.

మూడవమజిలి.

లఘుయేకాంత ప్రకరణము.

# శ్రీవైకుంఠమార్గము.

౧

శ్రీమతే నారాయణాయ నమః

పరాశరస్మృతియొక్క ఉత్తరఖండములో

శ్లో॥ డోలాయాంచర్శనంవిష్ణోః - ర్మహాపాతకనాశనం - హయమే
ధాయుతంపుణ్యం - సర్వకామఫలప్రదం । డోలామహోత్సవం
కుర్యాత్సకృత్వాపినరోత్తమః - కులకోటింసముద్ధృత్య - సగచ్ఛే
ద్వైష్ణవంపదం॥ జన్మర్క్షేవాసుదేవస్య - రాఘవస్యవిశేషతః
మహోత్సవంప్రకుర్వీత - డోలాయాంచనివేశయేత్ ॥

ముఖారిరాగము__ఆదితాళము.

రాకేందుముఖులారామీరు । రారేజాలాతాము । లోకోత్తరు
డగు శ్రీకృష్ణులకిపు - డేకాంతోత్సవము ॥౧॥ సత్యభామరుక్మిణిదేవుల

తో - సరసములాడునటే - సత్యవంతులగుసాధుజనులనూచక్కగ జూచునటే ॥౨॥ యిలనైష్టాభిరామదాసుని - యింటను వెలసనటే పలుమరుభక్తినసేవించిననూ - భయములుబాపునటే ॥౩॥

వ॥ ఇవ్విధంబున నావ్వారకాపట్టణంబునంగలసు వాసి నీవుణు లెల్లరునూపరస్పరాహూయమానులై వచ్చినాసర్వేశ్వరు వర్ణించుచుం డనలెండునూ యేకాంతగృహంబునకేగిహంసతూలికాతల్పంబునందాసీనుండయియున్న యనంతరంబ కర్పూరనీరాజనంబులొసంగుచున్నా రెట్లనిన ॥

కేదారిగౌళ—ఆదితాళము.

నందకుమారితె - నవనీతచోరతే -యింద్రాధరతెమంగళం॥ మందరధరతెమంగళం - మదనగోపాలతెమంగళం ॥౧॥ రాధికాలోల తె - రమణీయ్యశీలతె - బాధితాసురతె ।మంగళం ॥౨॥మంద॥ యీశ - సురేశతె - యింకొలుపురీశతె - కేశవనామతేమంగళం ॥౩॥మం॥

వ॥ ఇవ్విధంబునమంగళహారతులొసంగి, శోభనపురంపరావాప్తియగునటుల దీవింపుచు -తచ్ఛయ్యామందిరకవాటంబులుబంధించి వెడలినయనంతరంబ -నాయనాదిదంపతులు -సరససల్లాపాదులచేకొంత ప్రొద్దుపుచ్చి - నావెనుకమధురపదార్థంబులచే క్షీరపానాదులచే- కర్పూరనారికేళమిళిత - తాంబూలాదులచే-మలయమారుతంబులచే తృప్తింజెందుచూ-రతిక్రీడామహోత్సవంబులచే వర్తించుచుండిరి॥

ముఖారిరాగం—ఆదితాళము.

మదనక్రీడలు సలిపిరప్పుడు - శ్రీరుక్మిణీకృష్ణులు - మదనక్రీడలు సలిపిరప్పుడు ॥౧॥ మదనక్రీడలువదలక సలిపిరి । ముదమునినెదనెదనదుముకొనుచునూ ॥మ॥ ॥౨॥ కరములుకరములు - యురములు - యు

రములు - చరణములును - బహునురమునకొనుచును ॥మ॥ ॥౩॥ కోట లలోపల - పేటలలోపల - తోటలలోనడిబాటలలోను ॥మ॥ ॥౪॥ చెనవులనిరువుల - తరువులగురువుల - పసవుల - తెనవుల - నిసువు రుమరినరి ॥మ॥ ॥౫॥ మేడలవాడలనోడలగోడల - నీడలదూడల - వేమకలలరగ ॥మ॥ ॥౬॥ వనములజగముల । ఘనముల - మనముల- స్తనముల - ననయము - పెనగుచుయనిశయము ॥మ॥ ॥౭॥ చెట్టున చట్టునగుట్టను - మిట్టను - మెట్టను - పొట్టను - పట్టిన పట్టున ।మ॥ ॥౮॥ మింటనుమంటను - యింటను పంటను - కంటనుజంటను - వెంట ను । సతతము ॥మ॥ ॥౯॥ రాతిన - జాతిన - నాతిన - నేతిన - గోతి న - నీతిన ప్రీతిననిద్దరు ॥మ॥ ॥౧౦॥ సురలను - నరులను - దొరలను గిరులను - విరులను కురులను - మరులను - మరిమరి ॥మ॥ ॥౧౧॥ స్థిరముల - చరముల - వరముల - పురముల - తెరముల - ఖరముల స్థిరముగ - నిరువుగ ॥౧౨॥ ధనణిననింకొలుపురముననరహరి । చర ములనుమరి స్మరణ శేయుటకు ॥మ॥ ॥౧౩॥ ప్రేమనుపట్టాభి - రామ దాసహృత్స్థాములగుచుబహు - కామాతురులై ॥౧౪॥ ॥మదన॥

వ॥ ఇష్విధంబున సర్వదేశసర్వకాలసర్వావస్థలందునూ సహస్థ వస్తువులందునూ నిత్యానపాయత్వముచేనిండియుండి - రతిక్రీడలా డియాడి - బడలికం - జెందియుండగా - నత్తరిభక్తాగ్రేసరులు - సు షుప్త్యానందంబుజెందుడని బలుమారుంబార్థించుచున్నారు

నవోజురాగం—ఆటతాళము.

లాలినందకుమార - లాలిసుకుమార । లాలిమేఘశరీర - లా లియదువీర ॥లాలీ॥ ॥౧॥ సురలుమిముడేడగా - ధరణిలోబుట్టి - దురి తదానవకోట్ల - దురములోగొట్టి - పరమపావనులైనభక్తులనుబట్టి-

సిరులొందఁజేసినశ్రీజగద్భర్త ॥౨॥ లాలి॥ కనులుదెరువక నసురకాంత
జంపితివి - ఘనమయినశకటమును - కాలదన్నితివి । వనమునర్జునా
దర్తుపడిగగూల్చితివి - నినురోలగట్టితె - నేర్పుజూపితివి ॥౩॥ లాలి॥
తిరయైన సద్దులను తెంపివేసితివి - కృష్ణుడే - బకునితలగొట్టివేసి
తివి-దారుణంబుగవత్సదైత్యునణచితివి - శూరుడగుధేనుకుని సంహార
జేసితివి ॥౪॥ లాలి॥ కంసాదిరాక్షసులఖండించినావు - హింసాదులన్ని
మాన్పి - ఇలనేలినావు - సంసారులకుమంచి - సమకూర్చినావు - వాం
ఛావాహనముఖులనలరించినావు ॥౫॥ లాలి॥ ఈలాటిపనులను । ఇం
జేసిచేకి - నీళాదిసతులతో సిజ్జతలుసల్పి । పాలువూలికిచేత పవ్వ
ళించితివి వేళాయనిదుంబో - వేడుకలుమాని ॥౬॥ లాలి॥ నారదు
డువీణతో నటనంబుసలుప - చారణాదులు మిమ్ము వన్నుతింపంగ - త
గణమున తుంబురుడు । తాంబురనమీట । వారిపైరతిమాని పత్తిగి
లకృష్ణా ॥లాలి॥ ॥౭॥ కామించి సత్యాభామదాసనిపై - ప్రేమచేబలి
కెదవు ప్రియభాషణములు - నీమాటలవువినుచు । నినుబదలలేక ।
తామనంబుననిల్పిదాపదై యుండె ॥లాలి॥ ॥౮॥

నాధరామక్రియ - రాగము - ధూళుపాట.

యిందిరాదేవితో - గూడి - యింద్రియభోగములనొంది -
మందరధారినిదరించినాడు । హోహో యింద్రదేవ - సందడిమాని - గా
చియుండుమా ॥౧॥ జాగరణముజేయుచును - జానకితోడనుండి
బాగుగాగనిపెట్టియుండుమా ॥హోహో- అగ్నిదేవ - నాగశాయిపవళిం
చియుండె ॥౨॥ పాతకులపాపములను - ఘాతచేశిక్షలాడుండు -
నాతితోగూడుకనున్నాడు - హోహో ధర్మదేవ - నీతితోగనిపెట్టియుం
డుము ॥౩॥ నరవాహనము - జేసికొని-పురములెల్లదిరుగుటమాని వత

## గద్యము.

శ్రీమదాపస్తంబసూత్ర - కౌశికసగోత్ర - గంగవర
వంశపయఃపారావారరాకాసుధాకర వేంకట
రాయయోగీంద్రప్రపౌత్ర-కృష్ణయోగీంద్ర
పౌత్ర సుబ్రహ్మణ్యసూరిపుత్ర-పట్టాభిరా
మదాసశాస్త్రి - హృదయాంత
ర్గత భగవద్విరచితంబైన
శ్రీ వైకుంఠమార్గంబను
దుర్లభమోక్షాంతప్ర
కరణంబును మూ
డవమజిలీ.
సంపూర్ణము.

సమస్త భగవదవతారంబుల బ్రార్థించి మాయిలవేల్పుగానుండు వేంకటాచలపతిని సంస్మరించి - తదనుగ్రహంబుచే - సుకవిత్వ - మహత్వంబు నొంది । శ్రీమద్రామానుజగురూత్తము - ప్రసాదంబుచే నిస్సంశయంబుగా - శరీరశరీరకరూప - పరతత్వంబునుం దెలసి తత్పరికరభావంబుచే - నీప్రబంధంబు యక్షగానస్వరూపముగా లిఖించుచున్నవాడ॥

### ముఖారిరాగము—ఆదితాళము.

రాకేందుముఖులారా మీరు । రాత్రేజూతాము లోకోత్తరగుణ గుణ శ్రీకృష్ణులకిపుడేకాంతోత్సవము ॥౧॥ సత్యభామరుక్మిణీదేవులతో సరసములాడుననేటి । సత్యవంతులగు - సాధుజనములను - చక్కగ గాచుననేటి ॥౨॥ ఇల్లపై పట్టాభిరామదాసునీ । యింటను వెలసెననేటి । పలుమరు భక్తిని సేవించినను । భయములు బాపుననేటి ॥౩॥ ॥రాకేందు॥

వ॥ ఇవ్విధంబున - నాద్యాగ్రకాపట్టణంబునం గల । పుణ్యాంగనలోకరోకరింబిల్చుకొని । శ్రీకృష్ణమహాసంస్థానంబునకుం జని । యచ్చట గల - భాగవతోత్తములును - తానును - భగవత్సంపర్శనంబు జేసి మంగళస్నానాదులును - శ్రీమత్పీతాంబరాది సమర్పణంబులును - హోమకృత్యంబులును - శోభనగానంబులును - వేణువీణాదిరవంబులును । సేవించి । షడ్రసోపేతముగా భుజించి - తాంబూలంబులందిన యనంతరంబు । వారు శ్రీకృష్ణుల - నున్నతాసనులగా గావించి ।

### పదములు

౧. శ్రీమదఖిలాండకోటిబ్రహ్మాండ నాయకా - బహుపరాక్

౨. అతసీకుసుమాభ శరీరా బహుపరాక్

౩. సచ్చిదానంద స్వరూపా - బహుపరాక్

౪. ద్వారకాపట్టణ సౌధాంతరవిహారా బహుపరాక్

౫. శ్రీరుక్మిణీ సత్యభామా మనోహరా బహుపరాక్

వ॥ ఆసివిధంబున పరాకులు దెల్పి యనంతరంబ నాహారయాహ్న సమయమందత్యంత మహోత్సవంబులతో సంగసౌభాగ్యలక్ష్మీ తిరుమాహాలాయత్తచిత్తులై - వధూవరుల పక్షంబులధిష్టించి పూలబంతులాడుచుండిరెట్లనిన

హుశేనీ రాగము ఆదితాళము.

పూలబంతులాడువారు । పువ్వుబోణిరో । వేలుక్కొరకు ।మ రియు దెలిపె । మీనవనేత్రిరో ।పూ। ।౧। భక్తవరుల । తోడగూడిపా టపాడుచూ - పతాకిత్రికముల । సరములపూ । మోదమందుచు ।పూ ।౨। సామిభాగమందు జేరి । సరము లొసగ్యావే । భామరుక్మిణి । భాగమం దున। పాటపాడుచూ ।పూ ।3। పారిజాతపు । పూలబంతుల ।భామ వెయ్యవే నారీమణిరో । సేవకులతో । నర్తన పేయుచూ ।పూ।౪ ।తాం బుర తాళములును సం । దడులు మ్రోయగా । సాంబశివముఖాదిసురలు - సంతసిల్లగా ।పూ।౫। వేణువీణాదిరవములు - వెలయు । చుండగా - నానావిధమయినరాగములతో ।నర్తనసేయుచు।పూ।౬। నందనందన । కుం దరదన । నాగశయన - యిందువదన । మందరధర - యిందురమ్మణి ।పూ।౭।మాధవగోవిందకృష్ణ । మన్మథజనక - శ్రీధరగోపాలబాల। శ్రీహరీయని ।పూ।౮।పుండరీకాక్షరో । పురుషోత్తమా । పుండరీక వరద । రాఘవ । భుక్తిదాయని ।పూ।౯।వకరుబంతులెగరవేయ।నొక రుబట్టుచు - నొకరుతిరిగి । వేయసాగిన । నొకరు ర్గానీ ।పూ।౧౦।మ

వనంబున నిలచి వివిధములగు పె|త్తనములు సేతురు - వేడుకలలరగ

ను ||౧౭|| యింకొల్పురమున | వెంకటకృష్ణులు | పంకేజాక్షులతో -

మిక్కిలి | పరిహాసంబులతో | భోంకులుబోంకుచు - పద్దిపరిపిధముల-

శంకలు శేయుదురు ||శ్రీకృ|| ||౧౮||

వ|| ఇవ్విధంబునం| గొందరుపుణ్యాంగనల్లున్నపట్టణంబునంగల-

సువాసినీపుణ్యులు - నాహ్వానంబు జేసిని - యనంతరంబు భగవత్తే ర

ణంబున - నావహింపంబడ్డ భూసురోత్తములున్నా - గర్గాచార్యాదివ

ర్యాశ్రితులును - విచ్చేసి - సాయంకాలాగ్నిహోత్రాదులంశేయించి

నిత్యోత్సవ ప్రకరణ ప్రకారంబుగా - నాళిగ్రహ సమర్పించు చున్నా

రెట్లనిన||

సీ|| ధ్యానంబు జేశెద=దండమిడదు||

యివ్విధంబున| సర్వోపచారంబులుసమర్పించి| నావిదప|గర్భా

దానఖండమ్ము - విన్నవించుచున్నారు||

ఇట్లు వేదమంత్రంబులు - పఠనంబు చేశిన యనంతరంబ| ఫల

దానంబు లోనంగుటెట్లనిన||

కళ్యాణిరాగము—అటతాళము.

ఫలదానములిచ్చెను-శ్రీకృష్ణులు-ఫలదానమ్ములిచ్చెను-ఫలదా

నములిచ్చె| బ్రాహ్మణోత్తములకు - ఇలవర్పవెంబడి - యిల్లిల్లునర

యుచు ||ఫ|| ||౧|| తల్లికి స్త్రీలలకు - సేవించెడు - తండ్రికి| కొడుకులకు|

మళ్ళీమళ్ళీవారి - మరువక - నడుగుచు - యుల్లాసమునవారి ౹౹ యువ్వి

దయున్నీంగకూడి ॥ఘ॥ ౨॥ తియ్యమామిడిపండ్లు - తేజంబున - ద్రాక్ష
పానపండ్లు - వెయ్యేసి దెప్పించి - వేదోక్తరీతిని - సయ్యనశౌరియు-
పవర దక్షిణబెట్టి ॥ఘ॥ ౩॥ తాంబూలాదులతోడ - శృంగారములు
తినిసట్లు - జతిసేయుచు - అంబుజాక్షులకును - యువనీసురులకును -
కంబు గ్రీవుండపుడు - కాంతతోగూడుక ॥ఘ॥ ౪॥ ధరణిసింకోల్పూరి
లో - పట్టాభిరామ । దాసుని హృదయములో । నిరువు జేసుకొని -
యిందిరతోగూడి - మురహరుడావేళ - ముసిముసి నగుచును ॥ఘ॥

వ॥ ఇవ్విధంబున - ఫలకాముండగు గృహస్థునకు - ఫలప్రదా
నానుల సేయుట - విధియనిదెలుపుటకై - యవాప్తసర్వకాముండ
య్యును - భగవంతుండగు - నాశ్రీకృష్ణుండు - ఫలదానాదులొనరి
నంత శోభన గానంబులు సెలంగ నిట్లనిన॥

అఠాణరాగము—ఆదితాళము.

శోభనమే - నిత్యశోభనమే - హరికి - శోభనమే నిత్యశోభ
నమే ॥ప॥ శోభనమేనిత్యసూరులతోగూడి - యీభువనంబున - నిం
పొందు శ్రీహరికి ॥శోభన॥ ౧॥ శిష్టులరక్షింప - దుష్టులశిక్షింప - యి
ష్టము గలిగిన - యిందిరాపతికిదె॥ శోభన॥ ౨॥ వసుధసింకోల్పూర -వా
సుడై వెలిగెను - వసుదేవసుతుడగు - వనజాక్షునకిదె ॥శోభన॥

వ॥ ఇట్లు కర్పూరహారతి - సమర్పించిన - పిదప భజనకూటం
బునుండి - శయ్యాగృహంబునకు వేంచేయుచుండ నిట్లనిన॥

మధ్యమావతి—ఆదితాళము.

వెడలేగోపాలాబాలుడిప్పుడు శేషిగేహమునకు వెడలేగో-పాలాబాలుడ
ప్పుడు ॥ప॥ వెడలేగోపాబాలుడు - వేడుకలలరగ - పుడమినరుక్మి -

॥వ॥ మరియును - మహేంద్ర నీలమరకతాది మణిస్తంభ - న
ఖచితటంక - పటల దేహళీ కవాట విరాజమానంబయ్యును - శాతకుం
భ కుడ్య గవాక్షవేది కాసోపానంబయ్యును - విలంబమాన ముక్తాఫల
దామ విచిత్ర కౌశేయ వితానంబయ్యును । వివిధమణి దీపికా । ప్రస
రనిర్భాజమానంబయ్యును - మధుకరకులకలిత - మల్లికాకుసుమ
మాలికాభిరామంబయ్యును - జాలరంధ్ర నిర్గత - కర్పూరాగరు -
ధూమధూపంబయ్యును - వాతాయన విప్రకీర్ణ శిశిరకర కిరణ స్తోమం
బయ్యును - పారిజాత ప్రసవామోద - పరిమళిత పవనసుందరంబయ్యు
ను। యిట్టి మందిరంబు। నానావిధాలంకారంబులచే నొప్పియున్నదియే
యున్నాయని యభ్యాగతురాంగన। లోకరక్షకుం జెప్పుకొనుచూ - నాగ్ర
హాభ్యంతరంబునం గల - శరచ్చంద్రచంద్రికా ధవళహంసతూలికాతల్ప
మధ్యంబున - జగదీశ్వరుండయిన వాసుదేవుని । సుఖాసీనుండవుగ
నుండ్రి ప్రార్థించుచున్నారు.

## శ్రీరాగము అటతాళము.

కూర్చుండవయ్యా॥ శ్రీకృష్ణయ్యా। కూర్చుండవయ్యా॥ కూర్చుం
డవయ్యా యో - దుర్జనవినాశన - యర్చింతు మీవేళ - యతివరుక్మి
ణి తోడ॥ కూర్చుం॥౧॥ పువ్వుల పాన్పుపై - పువ్వుబోణుల కూడి -
నవ్వులాడుచు గాని - నందనందన వేగ ॥కూ॥ ॥౨॥ సామిపై పట్టాభి
రామదాసునకును - క్షేమములొసగనీ - క్షితిని బుట్టినహరి ॥కూ॥౩

వ॥ యిట్లు ప్రార్థంబుననయ్యావ్వలత్యంత ప్రేమాతిశయంబున - మ
రిమరియుం బ్రార్థింపరప మువ్వారకవ్వాలం ప్రకాశించు - మూర్తిస్వరూ
పంబుగ - నమస్కరించుచుండెనూ ముక్తికాంతా మనోహరుండయ్యు